# రా ధా మా ధ వ ము

## వి ల క్ష ల క్ష్మీ ప తి

అని యింతింతనరానికంతువెతచే నాక్రాంతమై స్వాంత మొ
య్యనఁ జీకాకయి చిక్కు చీదరయి తాపావేశముం జెంది కుం
ద నిశాశేషము నెట్టులో గడపి రాధాసాధ్వి యవ్వేళ సా
నునయాలాపుఁ గృతప్రణాము ననుఁ గృష్ణుం గాంచి సాసూయ యై.

పలుకం బోకుము కైతవోక్తులు భవత్పాండిత్య మెల్లన్ వితా
జలుపం జూతు వి దేల? మేలుర! నమస్కారప్రకారమ్ము, పే
రలవున్ మీఱె వినమ్రతాకలన మాహా! పొమ్ము నీతాప మా
వల కొత్తం గల యావధూటిదరికిన్ వైళంబ శ్రీవల్లభా!

నిసి యెల్లం గునుకంగఁ బోవమిఁ గడుం దీపించురాగమ్ము క్రొ
మ్మిసిమిన్ సారె నలంతిమూఁత వడు నీమేల్గన్ను కెందమ్మిదో
యి సఖా! చెప్పక చెప్పెడున్ వలపు దీండ్రింపన్ దముల్ వెంచి యొ
క్కసరోజాననకౌఁగిటం దవినచొక్కాటమ్ము గాటమ్ముగాన్.

అలవుమెయిం జిప్పిలురస
మొలపుం గెలసమ్ము మనికి నొనరించుడు నీ
లలి వెలి యవునను రాగము
కల నెలయించెడిని నీకు కనులు వయస్యా!

మినుకులు పొంగువాఁడఁ గొని మేల్రతనాలశలాకఁ దీర్చి ది
ద్దినకపురంపు కాటుక మదిం గొనునవ్వగలాఁడిలోలలో
చనములు ముద్దుగొంటఁ గతిచాయ నెసంగుచుఁ గృష్ణ! నీదునె
ఱ్ఱనినునుమోవి కూరిచెఁ దుఱంగలి యొక్కఁడు దేహయష్టికిన్.

అలరులవింటిబంటునడియాలపుటాలపువేల వ్రేలిగో
ళులకొన లంటి గంటువడి లోహితరేఖము నీదుమేను శ్యా
మల! విలసిల్లుచున్నయది మారకతోపలఖండకల్పితా
మలకలధౌతవర్ణఘనమారకలాజయరేఖముంబలెన్.

తవినపదమ్ము లన్న విరితామరపూవులదోయినుండి పె
ల్చి వెలలి జాలువాఱెడునలక్తరసమ్మున సిక్తమైన నీ
సువిపులవక్షమొప్పు వెలిజూపెడుజాడ ననుంగుసంగడీఁ
డ! వలితమారభూరుహాలలన్నవపల్లవవార మారయన్.

వాకో నేఁడని తాపముం గుడుచు ద్రోవం ద్రోసె మత్స్వాంతమున్
నీ కెమ్మోవిపయిం దయం బొరయకే నెక్కొన్న దంతక్షత

మ్మోకంసారి! వచించుచున్నయది ప్రేమోద్వృత్తి నీనాఁడునున్
నీకున్ నాకు నభేదముం దనువు మానిత్యమ్ముఁ బాటించుచున్.

ఒకటివేల్పు! నిక్కముగ నొప్పెడిఁజూవె బహిశ్శరీరపుం
బోఁకడ నోముకోఁ దవినపోఁడిమి ఆ కెన నీమనమ్ము నెం
త్రే కలుషమ్ము మై యనుగమించుజనమ్ము సుమాస్త్రునస్త్రపుం
గాఁకలకుం గుఱిం జలిపి కాఱియవెట్టుచునుంటి విమ్మెయిన్.

చులుకనగా నిజ మ్మరయుచోఁ, సుతిమెత్తనిపూలఁ బోలు గ్రొ
మ్మొలఁతల నొక్కిపెట్ట దిగ్రమింగ వనిం జరియించుచుంటి వీ
యలవున, సందియమ్మె, విన నాఁడు వధూజననిర్దయమ్ము నీ
పొలిచినచిన్ననాఁటికత పూతన పూసలు గ్రుచ్చుమచ్చునన్.

విరికెందామరయందచందములవావిన్ వావిరిం గూర్పఁ దీ
ర్పరి యా నోర్తుకకాళ్ళలత్తుకతో సంరక్తమ్ము వ్యక్తానురా
గరసప్రక్రియ మైన పేరురముతోఁ గన్గొంట నిన్ గూర్చె విం
కై, రసోనప్రణయమ్మునన్ వగపుకంటెన్ లజ్జ నాకిత్తఱిన్.

## ము గ్ధ ము కు ం ద ము

అవల వలగొన్న విరహార్తి నసురుసు రయి
తొడరుననవిల్తుకోల్తల నుడిగిమడిగి
కొన్న కలహాంతరితరీతి కుదురుకొనఁగఁ
జెలువుఁ దలఁచురాధ కను నెచ్చెలి యొకర్తు.

మానినీ! మానఁగదె యిఁక మాన మాక
లుముల మెలఁతయనుంగుచెలువుని పైని,
మధుసమీరాంకురము సూప మార్గ మతఁడు
వచ్చుచున్న వాఁ డభిసారవరము సేర.

ముదిత! మునుఁగఁ బోయిన తీర్థ మెదురువచ్చె
నెచ్చ నొడలిమఱు పవానివచ్చుముబిగి
కౌఁగిటం జొక్కు-భాగ్యము కలసి వచ్చెఁ
గలదె నెలవున నీ కింతకంటె సుగము.

చను మవాఁడు తోడుగ రస మనుభవించు
పనికి, గారవమునఁ దాటిపండ్ల మివ్వులు
సరసతరములు నీ మేలిచనులపేరి
స్వర్ణకలశమ్ములను వితాపఱతు వేల?

వెడఁగుతన మోముకొనుజాడ పీడఁ జూడ
కు, మతిరుచిరుఁడు వ్రేఁతలకూర్చువానిఁ,
బాలఁతి! సురకానికిం గొనఁబోవుగాక
యే నొడువనె కూర్కొని చెవి కెక్క నిదియ.

ఇంతి! యింతింత యనరాని చింత మునిఁగి
యరువు తెరువు నెఱుంగక యనువు దప్పి
యవురు సవు రొచు వందుర నవునె నీకు?
విన్న నగువారు నెచ్చెలిమిన్న లెల్ల.

క్రందుకొన మృదుత్వమ్ము, జల్లందనమ్ముఁ
జిమ్మునెత్తమ్మి రేకులసెజ్జపైనిఁ
దనువు వ్రాల్చినశ్యామసుందరునిఁ గాంచి
సకి! కొనఁగదె కన్నులకలిమికి ఫలమ్ము.

పూని బహురతుఁ డవ్వానిపైని నగ్గ
లమ్ముగా నచ్చలము విషాదమ్ము గుడుచు

మాట పని లేనిపాట; లేమా! రవంత
వినుము నామాట సేరఁగాఁ జనుము హరినిఁ

వచ్చు నైవచ్చునాలపున, మెచ్చు నీదు
గానము లను మానికమ్ముల, గ్రుచ్చియెత్తు
బిగికవుంగిట నిను వల్లవీప్రియుం డ
తంచు, మానుమా వగ, వేగ దరియఁ జనుము.

చెలువరో! చెలువుఁడు చెలఁగి స్నిగ్ధుండు గాఁ
బల్కుముల్కులు మది వగుల విడుతు,
దాసో౽హ మని మ్రొక్కి దరిసినఁ గిమ్మన
కెంతయు స్తబ్ధవై పంతగింతు,
తలకుమీఱినరాగకల నెలయించుచోఁ
జుఱచుఱచూడ్కుల సురియఁజేతు,
మిడిలినసుముఖతఁ గవయఁ గోరుదు బిఱ్ఱ
బిగిసి తెగడుచు మార్మొగము నిడుదు,

నీవు విపరీతకారిణి! కావె, మేలి
గందవొడిపోఁత క్రొంజేదు, చందురుండు
కాఁకమించులదొర, మంచు కాఱుచిచ్చు,
కూరుచురసాభివేశముల్ నారకములు!

## చతురచతుర్భుజము

ఆలోఁ, గ్రుంకుదెసం గుబురొక్కొనినసంధ్యారాగపూరమ్ముతో
హేలం దూఁగుచుఁ జేవురించినమొగమ్మే పార, రోసమ్ముమైఁ
జాలం బుచ్చుచు వేడియూర్పులు వయస్యం జూచు రాధం ద్రపా
లోలత్వమ్మున డాసి తా నను నిటుల్ గోవిందుఁ డానమ్రుఁడై.

అలివేణీ! శుభశీలశాలినివి కావా, కావవా నీవు పూ
వులవిల్తోఁటరికోల్తలం బడలి రేపుల్ మాపులున్ వాడి వ
త్తలునై హార్తినకౌతుకమ్మున భవద్ధ్యానమ్మునై నేండ్లు పూం
డులుగా నొక్కనిమేషముల్ గడపునన్నున్, మానవా మానముల్!

విషధరరాజుఁ గ్రొంబసిఁడిపేరిమిసొమ్ములుగా ధరించు దు
ర్విషమశనమ్ముసామితలఁ బెట్టినపీటగ వాస మున్న య
వ్విషజునియల్లుఁడైన ననవిల్దొరపేరిటిచిచ్చు చిత్రముల్
విషమతఁ గ్రమ్మెఁ, ద్వన్ముఖవనేజసుధారసపాన మీఁగదే.

తెల్లమ యా లలర్ వలపుదేనెలసోనలు జాలువారునీ
చల్లనిపలుకులం దలలజాలున వెల్వడుదంతకాంతినా
చల్లనిచేతులం బొలుచుచందురువెన్నెలజగ్గునిగ్గు ల
ల్లల్ల హరించుజాడఁ జనవా, చెలి! నా వెఱచిమ్మచీఁకటిన్?

తిరముగఁ గమ్మకస్తురితో తీరిచి దిద్దినయట్టిబొట్టునా
గరగరమైన మచ్చనవకమ్మున కిమ్మగునీమొగమ్ముచం
దురుఁ డొగి నాదుకన్నులను తోరపువెన్నెలపుల్గులన్ వధా
ధరమమృతమ్ముఁ గ్రోల గరితా! పురికొల్పునుగాత మీతఱిన్.

తెఱవ! నిజమ్ము నాపయిని దీఱనికోపమ పూనుచో నెదం
గఱకఱిమైని ఖరమ్ములు నఖమ్ములపేరిటివాడితూపులం
బఱపుము, కూర్చుమా ప్రిదులువాఱని దోర్యుగబంధనంబు లే
డైఱ రదఖండనంబులు పదింబది సేయుమ హాయి సేకురన్.

పువ్వుబోఁడీ! యిటు వింటె, నాదురవణమ్ముల్ నీవె సూ, జీవతం
తువు నీ వౌదు, మదీయసంసరణసింధుప్రస్ఫురద్రత్న మీ
వె, వినీలాలక! నాసమస్తమును నీవే, యిట్టివేళం బ్రస
న్నవు కావే, యతినించుచున్నది కదున్ నాడెంద మద్దానికై.

కలికికొలమ్మమిన్న! ననగల్వలచెల్వము వెల్వరించునీ
తులుకులవాలుగన్నుగవ కోకనదమ్ములయిమ్ము సూపెఁ, బూ

విలుతునివాడితూపుగమిపేరిమి నయ్యది కృష్ణ నన్ను రం
జిలఁ బొనరింప నేర్చునెడఁ జేకొనుఁ జూవె తదర్థసిద్ధినిన్.

వనిత! భవత్స్తనమ్ము లను బంగరుకుండలపై నటించుశో
భనమణిమంజరుల్ హృదయభాగము రంజిలఁ జేయుఁగాత, చ
క్కనిరవళుల్ దగన్ బసిఁడిగజ్జెలక్రొమ్మొలనూలు లోల మా
ఘనజఘనమ్ముపై మెఱసి కామనిదేశము చాటిచెప్పుతన్.

కలకంఠీ! తలబంటికంతువెత ముక్కల్ వెట్టు నేఁ దెప్పరి
ల్లులలిం బల్కవ యొక్కమాఱు, తలఁపుల్ వొంగన్ స్థలేందీవర
మ్ముల నవ్వంగలపేర్మి నాదుహృదయమ్మున్ రంజిలం జేయునీ
కలితాంఘ్ర్యబ్జయుగం బలక్తకసరాగంబుం బొనర్తుం జెలీ!

సకీ! పువువిల్తుపేరిటివిసమ్మున కీశ్వరి వేఱు, నాదుమ
స్తకమున కొప్పు మండనము తావకపాదముపేరిపల్లవ
మ్ము కరుణమై నొసంగఁగదె ముమ్మరమై మది నేర్చుచూతనా
యకకదనానలమ్ము బలు వారఁగఁ గూర్చువికార మాఱఁగాన్.

పొలఁతిరో! మది నఱక నీపోవునెల్ల
పోఁకలకు స్వస్తివాక్కులు వొనర నొడివి
మానుమా యింకఁ గల శంక, పూని సుంత
స్వాంత మెడ భవద్ధ్యాననిస్తంద్ర మీను.

తోడరి సువర్ణకుంభములతోఁ గరికుంభతలాలతోడ నె
క్కుడు తులఁ దూఁగు నీ చనులు, కూర్చిపిఱుందులచంద మాక్రమిం
చుడు నెడ యీఁని నాయెడఁదఁ జూడఁగరానిపిపాసి పూవువి
ల్తుఁ డొకఁడె గాక నేర్చెడిని దూకొన నెవ్వఁడు లాఁతి నాతిరో!

కల్ల కైలాటకము టక్కు గాని వేఁడి
కోలునన్ నమస్కృతులు చాల వల్లె
నెట్టుననుఁ బెరవానిఁ గావింపఁ బోక
కౌఁగిటం గ్రుచ్చి యెత్తుము కరుణ మెఱయ.

చనఁ గోపమ్ము సుశిక్షితుం జలుప నన్ జాలింతువే, దంతదం
శనదోర్వల్లినిబంధనోరుకుచసంస్పర్శాదులన్ నీవు, మా
నిని! గోపా వెడవింటిబం టుదటునన్ బ్రీలించుటం జేసి వే
చను మత్ప్రాణసమీరణం బిపుడె, హర్షమ్మొందుమా యష్మోయిన్

ఇందుముఖీ! లతాంతశరు నెక్కిడినట్టిధనుస్సునందముం
జందము మీఱు నీకుటిలచారుతరభ్రువు వోల్పఁ గోడెగాం
డ్రందఱు మూర్ఛిలం జలుపువ్యాళియ పోలె, నడంపఁ దద్భయా
స్పందత సిద్ధమంత్రము భవన్మధురాధరసీధు వొక్కఁడే.

లలనా! పల్కమి మాను మింక, మధురాలాపమ్ములం బంచమ
మ్మలరం జేయుము, రూపుమాపఁగదె తాపావేశముం గూర్మిచూ

ద్భుతలమేలుపులుకుల,మారొగ్గమ్ము చన,దన్ను ర్స్నిగ్ధుని నన్ను నా
వలకుం ద్రోయుతలంపు నీ వుడిగి దోర్బంధంబునం జేర్పుమా.

అలవున నలివేణి! కలుపుఁ దా మంకెన
పూవుఁ గోమ్మెలుఁగుత్తో వావి మోవి,
అద్దాల లాలించునచ్ఛఁపుఁజెక్కిళ్ళు
లిప్పపూవులనిగ్గు నెగసి నవ్వ,
నలిఁ ద్రోసిగా జను నలగల్వ చెల్వమ్ము
గరువమ్ము నునుసోగకన్నుదోయి,
తొడరినసం పెఁగతోడి నేస్తమ్మున
భావింప దెవ ముకు నూవుపూవు,

రదనముల్ కుందముల నోరు మెదపనీవు
నిక్క మేనాఁడు; నటుగాన నీమొగమ్ము
వరవుడముకల్మి ననవింటిదొర కరీంద్ర
యాన! లోఁగొనుచున్నవాఁ డఖిలజగము.

పువువిల్తుఁ గొవ్వాడిములుకులు కులుకుచూ
డ్కులు మదాలసలు సూ పొలుపులాఁడి!
తమ్ములకందచందమ్ములలిపి నేర్ప
నోపు మెూ మిందుమత్యుజ్జ్వలమ్ము,

జనతామనోరమ ఘనజఘనస్థల!
నీసురుచిరగతి నికుటవమ్ము,
రంభాతిరసిక్రియారంభసంరంభసాం
ద్రము లూరువులు, తిలోత్తమకల నెల

యించు నాసిక, కనుబొమ లెన్న రుచిర
చిత్రలేఖలు, నీ రతి చెలువలతల
మానికమ! కలావతి, నీవు మహిగ వయ్యు
వేల్పుటింతులపొలుతుల వెలయుచుంటి.

## సా నం ద దా మో ద ర ము

అనుచర్ భీతకురంగలోచన వయస్యా దా సమాశ్వాసవా
క్యనికాయమ్ము దలిర్ప శౌరి సుముఖం గావించి మే లెంచి పాం
తనికుంజాంతరశయ్యపై నొఱఁగె, నంతం జింతయాకుల్ ముడిం
గినయవ్వేళ సువేష రాధ కనుఁ బంకేజాస్య యొక్క_ త్రిటుల్.

గోలా! జాలి సెలంగఁ గూర్మినునుపలుక్ల్ పల్క నీ మేలిపా
దాలన్ నెన్నుదురంట మ్రొక్కు చిపు డాతం డయ్యేడన్ వ్రాల్చె మే
కేలీకుంజగుహాంతరోల్లసిత మహా కెందమ్మిపూసెజ్జపై,
నేలా పంతము? లా ప్రియుం గవయ నీ వేఁగంగదే వేగమే.

ఇంతి! యంతు పం తెఱుఁగని యీవియోగ
సాగరము మీఁద నీఁదఁగఁజాలు టరిది,
లాఁగ నేటికిఁ గోటికి లాఁగువాఁ డ
సమశరుండు బిగువు కొనసాఁగఁబోదు.

పెనుమడికట్టునిబ్బరపు ప్రేకనిచన్నులబర్వఁజేసి య
ల్లన మెలమెల్ల కుల్కునడల్ సడలించుచు నాడునంచ మిం
చినగరువమ్ము నాముకొనుచెల్వమునం జెవివిందుఁ గూర్పఁ బం
బినరతనాలయందియలమేలురవళుల్, ప్రియుఁ గూడఁ బోఁగదే.

సకి! వింటే, ద్రుఘణాండభాండమునకున్ సమ్మోహనాస్త్రం, బ్సమ
స్త్యైకదంబంబునకున్ సుధాఝరి, మునివ్రాతమ్ముజీవాతు, వ
ల్ల, కల్లోలాసిని! యాదవతమ్ములమరుల్ మాతంగి, నీకున్ సుమా
స్త్రకళాదేశ మవాని వేణువునినాదమ్మున్ రసశ్రీదమున్.

జవరాలా! తిమురుచనుం
గవకోమరాలా! వరాలగను లనఁ జనుమే
లవములఁ బువ్వువిల్తునిముద
ల విశదగతిఁ దెలుపుకోయిలల మదిఁ గొనవా?

సరవి సుమందగంధవహచంచల మౌ చివురాకుజొంపమున్
మురువుహొరంగుచేత వలపుల్ దలఁపుల్ నిగిడించి నించుమా
విరి బురిగొప్పఁ బొల్పడిరి తీవల కొటటీవబో డ్లు నిన్
సరగ మురారిఁ జేరుజతనమ్మున, కిమ్మెయిఁ బ్రొలుమాలెదే!

అరిమురిఁ బృచ్ఛసేయుమ, యనంగతరంగవశంబునంబలెన్
స్ఫురితమ యాచు సూచితమనోహరముత్పరిరంభసంభ్రమా

దరము విహారిహారరసధారనిరంతరమైన నీ మనో
హారకుచకుంభయుగ్మకము నాతఁడు పాయెడఁ బండో కాయయో.

తరుణీ! యను వవృతొడవ్వులఁ
బరిష్కృతము నీమృదుతనువల్లి పువ్వుజిరా
దొరమురిపెపుకేలులతోం
దర చెప్పక చెప్పఁ దొడఁగుతగవున మిగిలెన్.

లలి భువనైకమోహనకలాకమనీయములైన వాలుచూ
పులుపలుతూపులున్, ధనువుపొల్పుబొమల్, నొడులస్త్రశస్త్రముల్,
కల బలముల్ కలల్, విజయకాహళముం గటిసూత్రకింకిణీ
కలితరవమ్ముగా వెలలి కాయజుపోర మురారి గెల్వుమా.

లేపవడాలడాలు వఱలింపఁగ నేస్తము పూవువిల్తును
న్దూపులఁబోలుగోళులతొ తోరము క్రొందలిరాకుచేత నీ
వో పికవాణి! వాణిఁ గొని యూఁతగ నాతనిఁ జేర నేఁగుమా
యాపయిమాట కింతి! వలయుక్వణనమ్మె వలంతి బూటయా.

ఏలా పోఁకలు వే లిఁక?
గోలా! యావాఁడు నోడఁ గూర్చిన దూలం
బై లంకె నుండఁ జేసె వి
రాళిన్ నీయంద తనదుప్రాణానిలముల్.

కలికిరో! కపురంపుకాటుకవీటునఁ
గులుకుకనుంగవకొలుకు లంటి,
జానైనచీఁకటిక్రానుఁగుపువ్వుగుత్తు
లనుపేర వీనులచనవు లెఱిఁగి,
నిండారునలగల్వదండలపోఁడిమిఁ
గుఱులమెఱుంగులఁ గూడిమాడి,
కమ్మకస్తురిపత్రకమ్ములయొమ్ములఁ
దిమురుచనుంగవతీరు లరసి,

కప్పదుప్పటివలె నొప్పి క్రమ్ముకొన్న
కారుచీఁకటి యిది చలి కాలఁ దన్ని
యేఁగునభిసారికలతను వెల్ల నిండు
కౌఁగిటం జేర్చుచున్న దొల్కఁగ రసమ్ము.

సకి! కాశ్మీరపరాగగౌరసుతనూసంపద్విలోలాభిసా
రికలం జుట్టును గ్రమ్మి బద్ధసుషమారేఖమ్ము తాపింఛవృ
క్షకలాబాంధవ మైన యీ తిమిర మా జారాగ్రణిప్రేమము
న్నకడానిన్ నికషోపల మ్మయి నితాంతమ్ముగా వెలింగించెడున్.

అన నెక్కొల్గొనుకోర్కిమైఁ జని లసద్ధారావళీలోలకాం
చనకాంచీవలయోరునూపురవిభూషాస్వచ్ఛరింఛోళికో

భనతాదీపితకుంజకేళిసదనద్వారంబునన్ నిల్చి పా
ల్చినలజ్జన్ జకితాక్షి రాధ కను నచ్చేటీవతంస మ్మిటుల్.

చివురుజిరావజీరునవ్యచివ్వకుఁ జివ్వనఁ దొందరించునీ
మివులుహారంగువేస మిది మేలు, జయేందిరజాడఁ బైఁడిబొ
మ్మ! వలపు నింగికిన్ నిగుడ మంజులవంజులకుంజకేళికా
భవనగతుం బ్రియుం దరిసి పాయక నీయొడి నింపుకోఁగదే.

తరళసుతారహారలలితమ్ములు నీబిగిచన్నులన్నని
బ్బరపుసువర్ణకుంభములు, భారపు మేల్జఘనమ్ము బల్మెఱుం
గరితరో! సోఁకుచుంటఁ గసుగందుచు వాడెడినో యశోకప
త్రరచితశయ్య పూను మొగిఁ దవ్వ్యవధాన మొకింత యింతిరో!

గదుముచు నాముకొన్నకుతుక మ్మొదవ నోముకొనంగ గందుతు
మ్మెదదొర కోశ మానఁజనమిన్ రసపూర మవారిఁ జిమ్మునీ
మృదుతరతల్పసూనములు మేకొని నీమెయిచెల్మికల్మినిం
బదిఁబదిఁ గోరుచున్నయవి వావుల నంపి ప్రసూనకోమలీ!

నిరవద్యా! భువనైకమోహనకలానిష్ణాత మా శ్యామసుం
దరు సంగీతరవమ్ము పేరి హృదయాంతర్వర్తికందర్పసా
దరసందేశము వీనువిందులుగ మంద మ్మైన చందమ్ము ప
ర్వ రహిం విన్చెడుదక్షిణానిలుఁడునావార్తాహరున్ మెచ్చితే.

విలసిలుపూవుగుత్తులను వ్రేఁకనిచన్నులపొం గెసంగఁ దీ
వలయనుతీవబోఁట్లబిగిఁబాయనిలేయివురాకుచేతికౌఁ
గిళులరసాల మున్గి గిలిగింతలు వాఱురసాలపల్లవా
గ్ర్యుల నలువాఱునిమ్మహితకుంజతలమ్మున కాదె నీ తముల్ !

సుళువుగఁ బూవుదేనియలు చుబ్బనచూఱలు గ్రోలి గ్రోలి మ
త్తిలినమిళిందబృందములతీయనిపాటలవేరివిస్వన
మ్మలముకొనంగఁ బూవిలుతునాఱవతూపటు లిడ్డ చొచ్చి లో
నలవున నీవు సౌరతపుటాలమునందు నవాని నొంతుగా.

చిరవిరహార్తిఁ జిక్కువడి చిక్కి సగమ్మయి తూలి యస్సురు
స్సురనవు శ్యామసుందరుఁడు చూడ కొరున్ వెలిఁ బల్కినాఁడొ బం
ధురము కుతూహలానఁ బ్రియుతోడ భవచ్ఛుభసంగమమ్ముఁ దా
మొరు లొరు విన్చికొంచు నలు వొప్పెదు వింటె విహంగదంపతుల్.

పొలఁతీ! యాత్మ భవచ్చిరంభరణసంస్ఫూర్తిం గడున్ డస్సి పూ
వులవిల్పోటరి తాపముం గుడుప సొంపుం బెంపునుం బాసి పే
ర్కలకం బూవులసెజ్జ నిట్లొఱఁగి తాఁ గాంక్షించుచున్నాఁడు వి
హ్వలుఁ డాతండు భవద్వరాధరసుధాస్వాదమ్మునుద్యోగమున్.

కులుకుమెఱుంగుబోఁడి! మదిఁ గోరిక లీరిక లెత్త నీపద
మ్ములయను నెఱ్ఱదామరలపూజనమందు మునింగి కన్నుస

న్నల నెలయించి మించుగతి నాయము( బాయనివానియంకపా
ళి లలి నలంకరింపుము చెలీ! యొకమాఱు వరాలమూటవై.

అనునన్గుం జెలికిలుకు-పలుకు-బడి భావావేశముగ, వ్రీడ, వీ
డనికౌతూహల ముప్పతిల్లి ముడివెట్టన్ ముప్పిరిగ, రాధ చ
ప్పున( గన్గల్వలు వైచుచున్ దెసల నప్పూవింట ్రమోయగ లస
న్మణిమంజీరయుగంబు తూగొని రసోన్మత్తత్వ మేపార(గాగ.

అనుగునెచ్చెలి మోముకనుకలి నొలసిన
వివిధముల్ వికృతుల వెలయువాని(,
బస యొసంగినరాగరసపూర మొకు-(డే
జీవగఱ్ఱగ( బేర్మి( జెల(గువాని,
నలవోక నిగిడి గోవాపులకోడె లా
కోర్కు-ల( గలలజా ల్గొసరువాని(,
బొంగి వే పొరలుననంగతరంగమ్ము
లకు నిర వైనమే ల్తనువువాని,

రూపు వొరసినముద మన నొప్పువాని,
నిండుచందురుచూడికి నిగిడి నింగి
కెగయుతర(గల మిగులునబ్ధిశునట్లు
మానినీమణి ప్రియు( జూచి మఱచె మేను.

చినుకుంబూసలపేరులాఅనిరుచిశ్రీమించువక్షస్థ్సలం
బున విన్యాసముగా ధరించి లలి ముర్వల్ జూపునుర్వల్ దలి
ర్ప నమోఘస్థితిఁ బర్వెవాఱుయమునాస్వచ్ఛాంబుపూరంబుడం
బునఁ గన్పొందులు గూర్చెఁ గృష్ణుఁ డతఁ డంభోజాక్షి కప్పట్లునన్.

శ్యామలమున్ సుకోమలము సర్వకలాకమనీయమున్ రస
శ్రీమహితమ్ము గౌరపటచిహ్నిత మా మురవైరిరూప మెం
తో మురువాఱె, మూలమున నొప్పినవుప్పొడిపూఁత దట్టమౌ
కామునివాడితూపునలఁగల్వకుఁ జెల్వము నేర్పు నోజయై.

పరమరసాకరమ్ము లయి పాతరలాడుదృగంచలమ్ములన్
మురువవుమోముగోమున మనోహరరూపుఁ డవాఁడు పుల్లపు
ష్కరముల నాట లాడికొనుకాటుకపిట్టలతోడిదౌ శర
త్సరసుహారంగునన్ విరహతాపమునే పడఁగించె రాధకున్.

గుఱుతుగ మోముదమ్మితళుకుల్ బెళుకుల్ ద్విగుణమ్ము లౌపరా
మఱికఁ బరాకు వొందని సమంచితకుండలరశ్మిమాలిక్రొ
మ్మెఱుఁగులు చెక్కుటద్దముల మీఱి పరావృతి నొంది త్రోసి మే
ల్మెఱిమెయి నాపెచిత్తగుహ నిండిననివ్వెఱపేరిచీఁకటిన్.

శారదవేళ నామొకొనుజగ్గులనిగ్గులఁ గ్రొవ్వి మొవ్వముం
గూరుచుమొల్కనవ్వుతళుకుల్ దవు మాధవుమోముచందురుం

డారసపూరమగ్నకనులన్బడు వెన్నెలపుల్గుదోయికిన్
సారె వరాధరామృతరసమ్మును గ్రోలఁగఁ గూర్చెఁ గోరికల్.

సరసతఁ బూర్ణచంద్రకరసంస్ఫురితోదర వారివాహసుం
దరసులతాంతకుంతలనితాంతమనోహరుఁ డా మురారి బం
ధురతిమిరోదితేందునిభనూతనచందనబిందుకల్పనా
కరవదనారవిందమునఁ గన్కలిఁ దేటిఁ బొనర్చె రాధికన్.

ప్రకట[illegible] నవాకృతిం బొదలు భావతరంగములం గదంబకో
రకములువోలె నెమ్మెయిఁ దిరంబులు ముత్పులకల్ గుదుర్కొనన్
గకవిక లయ్యెఁ జూతదలకాండనికామహతిన్ విభూషణ
ప్రకరసముజ్జ్వలాంగుఁ గని రాధ ప్రియున్ రసవార్ధి మున్గెఁ దాన్.

కొనకొని, దాఁటి మేలికొలుకుల్, దవుశ్రోత్రపథంబుదాఁక వే
చననవృటం బడల్పడియె చంచలతం గయికొన్న రాధలో
చనయుగలమ్మునుండి వడి జాల్గొని దుల్లెఁ బ్రమోదబాష్పబిం
దునికరముల్ మనోహరుఁ గనుంగొనుసంతన స్వేదమో యనన్.

అనుఁగున్ నెచ్చెలు లెల్ల రొక్కరొక్కరై హర్షత్రపావాప్తి ద్వా
రనిరుద్ధమ్ము నికుంజమున్ విడిచి పో రాధామృగినేత్ర చే
తన కండూతి నెపమ్మునం బిహితముగ్ధస్మేరవక్త్రమ్ముగాఁ
దనివారం బ్రియుసోయగ మ్మరయుచుం దాఁ జేరెఁ దల్పాంతమున్.

చనవుల్ మీఱఁగ జారగోపకుఁడు నా శంపాలతాతన్వి నె చ్చినకోర్కెఁ సుదృఢస్వయంగ్రహసమాశ్లేషంబునం జేర్చి చి క్కనియక్కలికి మెఱుంగుచన్మొనలు వీఁకన్ గంతుకుంతమ్ము లా చు నిరాతంకతఁ జొచ్చి వచ్చినవో యంచుం బృష్ఠదృష్టిం దవెఁ.

అసమానసౌందర్యరసధి నై స్మరసతీ
లావణ్యలలితవిలాసకలన
నోరపారలు దిద్ద నేరుచునారాధ
స్వాంతమ్ము పేరిటిపల్వల మ్మ
నంగకేళులకూర్పురంగస్థలమ్ముగాఁ
బొంకమ్ము దఱుఁగనిబింక మెసఁగు
తదురోరుహములు నాఁ దవుసరోరుహముల
తోడిఖేలనముల వేఁడుకపడి

తోడిఁబడనిబత్తిఁ దనచిన్నియడుగులన్న
తమ్మిపూవులె దిక్కుగాఁ దలఁచువారి
మానస మ్మన నిమ్మువుమానసమున
నంచయువు టత్తఱిం బ్రకటించె శౌరి.

## సుప్రీతపీతాంబరము

పొసఁగినకంతునిపస వింతకసమస
లెసక మెసంగ మనసు మనోహా
రుస కప్పనము సేసి క్రొందలిరాకు కె
మ్మోవిపై నిసిఁజింత మొనసి వాఁఱు
మొలకనవ్వులతోడ నలికమా సిబ్బితి
వలఁగొన స్మరపరవశత మివులు
నాకూతమున స్ఫీత మైన నిండరితి ము
న్కలు వెట్టు నరవిరికలువకనులు

సారె విరిసెజ్జ వైచుచు సరసములుగఁ
బలుక నెదొ పూని తొడిఁబడి పలుక మాని
కులుకుమొా మటు ద్రిప్పి కొంగ్రొత్తమురువు
నేలుప్రియ కను మురళీవిలోలుఁ డిటులు.

కామిని! కనుఁగవ కెడమా
కామునిపేరింటిగాము కని మసఁగి సెడం
గా మఱిమఱి నడఁచె ననుం
బ్రేముడి నొకనిముస మనుసరింపంగదవే.

పొలఁతీ! నీ మెత్తనియాడు
గులచుట్టఱికమున మెఱయఁ గుతుకంపడునీ
తలిరాకుమేలిపానుపు
చెలువముకలిమికి ఫలమ్ము చేకూర్పఁగదే.

కొనకొని దూరాధ్వానుస
రణమునఁ గడు బడలి వాడెఁ గ్రాల్గంటీ! యెం
డ నిడునివ్వళ్ళటు నీ మె
త్తనియడుగుల నొత్తు దిడుము త్వర విరిమెత్తన్.

మెఱుఁగుంబోఁడీ! కొని నా
తెఱఁగున్ భవదనుసరణవిధి రవంతే నే
మఱఁ బోవని నూపురముల
వఱలింపుము విరతి విరులపానుపుపైనిన్.

నవకమునం గొంగ్రొత్తలు
చవు లూరన్ మోముపేరిచలువలదొరనుం

డి వడిం గుఱియింపుము నీ
వవిరళములు పలుకు లన్న యమృతపుసోనల్.

లలి నసురుసురునఁ గూల్చుచుఁ
బొలియక మసిరినవిరాళిఁబోలెఁ బ్రసవకో
మలి! నీచిక్కనిచనుబం
తుల కవరోధమ్ము చెఱఁగుఁ దొలఁగింతు నిదే.

వలితరసాస్పదమ్ము లయి వచ్చమునం దెడయాక చెల్వఁ గో
ర్కులు నిగుడం గుదించుటనొకో పులకల్ దొడి నిబ్బరమ్ములై
కులికెడునీదుచన్నులను గ్రొత్తకడాని మెఱుంగుకుండలన్
నిలుపు మిచోట, రూపఱుత నిల్వనఁ గ్రాఁచువియోగతాపముల్.

చెడి మన మెల్లన్ మల్లా
మడియై విరహార్తి నీదుస్మరణపథమునం
బడి బడలిననాకమృతపు
నడబావిన్ మోవి నొసఁగునయముం గొనుమా.

కూరన్ స్పృహ నీపేరిటి
కూరన్ నంజుచు వియోగఘోరరుజార్తిన్
సార మ్మఱి చేడ్పడునా
కో రమణీ! వెజ్జు నీదుయోగ మొకండే.

ఓపరిపూర్ణచంద్రముఖి! యొక్కపరిం గనుమాత్ర నాఱవే
తాపము లెల్ల నిఁక; గలరుతమ్ముల కిమ్మృదువాతపాట యా
నేపున రత్నకాంచి మొఱయింపు, మెలర్చుత మత్తకోకిలా
లాపములం గరమ్ము వికలమ్ములు నా చెవు లజ్వరమ్ములై.

కలిగినవ్యర్థరోషమునఁ గాసటబీసట సేసి నన్ను నీ
**తొలపునఁ** జూడ నిష్ఠు మొగమోడినపోఁడిమిఁ గొల్కులంటి మూ
తలు వడనీదువాలుకనుదామరలన్ విరియింపు మింత కో
కిలకలవాణి! క్రుంగి గతిఖేదముతో రతిఖేదముం జనన్.

ఈ తెగఁ బదియార్వేవుర
వ్రేఁతలమడిబొడ్డుపుడ్డు విప్పినమునిప్రము
చ్చాతఁడు వలుకుచు నాచెలిఁ
బ్రాఁతిగ లోఁగొనె స్మరసమరజయరమనటుల్.

కొనకొను పేర్మిఁ జిక్కనికూర్మికొఁగిళ్ళఁ
బులకాంకురమ్ములు మోసు దొడిగి,
నిగిడినతలఁపుల నెఱిఁ గుల్కుచూడ్కుల
సారె నిమేషముల్ సందు లెమకి,
చవు లూరు నమృతరసము బావి కెమ్మోవి
ద్రావుచో నరోన్మత్తు లావహించి,

కలలుకొన్నయనంగకలలపేర్కలనున
నానందరసప్పూర మలవు సూపి,

తఱిని బొసఁగింప రసభంగ మఱిముఱి మెయి
మాటఁ దడవనిరాధికామాధవులను
రతసమారంభసంరంభ మతిశయించె
వర్ణనీయ మవర్ణ్యానుభావమునుగ.

బడలి నల్గుడున దోర్వల్లిబంధమ్ముల,
స్తనశైలముల నురస్స్థలిని బూని,
క్రొవ్వాడిగోళులకొనలగంటులు గుచ్చి
దశనక్షతాధరదశ లెఱింగి,
బలుపుపిఱుందులపలుతాఁకులకుఁ దూలి,
జుట్టు వట్టిన వంగి చుట్టివచ్చి,
వాతెరమధువులపోఁతల మూర్ఛిలి,
కొనకొనువివశతఁ గనులు మూసి

మఱియు నేవేవొకలలకు గుఱి యయి పరి
పీడితుం డయ్యు వల్లవీప్రియుఁ డతండు
వడసె నొడువ నేఱని యొక పరమతృప్తి;
భళిర! కామగతి నికామవామ తలఁప.

అడరం జెల్వొని గెల్పుపూనిక మరుకయ్యంబందు వామమ్ముపె
న్దొడ రాజిల్లెడురాధ పైకొనుచుఁ దోడ్తోఁ బోరె, నప్పాట రా
పడియెం బో జఘనంబు, దోర్లతలసత్త్వమ్మాఱె, వచ్చెమ్ము దా
వడఁ గెక్క, గన్నులుమూసెఁ, బౌరుష మెటుల్ ప్రాపించువాల్గంటికిన్?

పాటించె నొకనీటు పాటలపాణిజాం
    కూరచిహ్నిత మామె పేరురమ్ము,
నెఱయించె నొకముద్ర నిద్రాభరమ్మున
    శోణ మకాంతదృక్కోణయుగము,
త్రోసిరా జయ్యెఁ గర్పూరవీటీక్షత
    బింబాధరపుటరాగంబు డంబు,
జలజల రాలుజాజుల ముడి వీడఁ బే
    రిచె విలులితకబరీభరమ్ము,

కాంచి యంచలమున జారె నంచుకంత;
ప్రొద్దుపొడుపున నీసుద్ది గ్రుచ్చఁబడియుఁ
జూడకల మరుములుకు లివి శ్రీశునిమనమ్ముఁ
జీల్చె మొన దేలి క్రాల నచ్చెరువుబరువు.

సడలెన్ వేనలి, ముంగురుల్ సెదరెఁ, బెల్చెం జెక్కుటద్దమ్ములం
బొడమెం జెమ్మటబొట్లు, మోవిజిగి డంబుం బాసెఁ బల్సోఁకి, పు

త్రడికుండల్ చనులందచందముల ముక్తాహారవారమ్ము సం
దడిఁ గొల్లంగొనె, బ్రుంగెఁ గాంచిరుచి మేనన్ రాధ కప్పట్టునన్.

ఆలలితాంగి చలించుచు
గాలిం బూదీవవోలె గాఢపుద్రప చే
వ్రేళులఁ జనులుం బిఱుఁదులు
జాలం గప్పుచు నొకండుసొరున మెఱసెన్.

సిరి మీఱన్ దరమీలితాక్షులు, లసత్సీత్కారధారాకలా
దరముగ్ధాకులకేలికాకువికసద్దంతాంశుధౌతాధర
స్ఫురణ వ్యక్తాననురక్తనెమ్మొగము నేపుణ్యాత్ముఁడో క్రోలు ని
బ్బరముల్ గుబ్బలు స్తబ్ధతం భృశపరిష్వంగంబునం గైకొనన్.

ఈలీల లతాంతాయుధు
నాలమునం జాల తూలి యప్పొలఁతి సము
ద్వేలరసాంబుధిఁ దెప్పలఁ
దేలుమనోహరున కనియెఁ దేనియనొడులన్.

మఱిమఱి పచ్చకప్రపుమారముతో విరితేనెసోనలోఁ
గఱఁగినమంచిగందపుడిఁ గా దను చల్లనిచేతఁ గూర్పు మే
మఱక విచిత్రపత్రతతి మంగళమన్మథకుంభబాంధవం
బఱిముఱిఁ గొన్నయియ్యెడ ననంగతరంగము లుల్లసిల్లఁగాన్.

అదను నెఱింగి పూవిలుతునమ్ములు కుప్పనగూర లేయుచుం
ద్వదధర ముఁది ముద్దుగొనుపట్టున జారినకజ్జలంపుసం
పద వెలిదమ్మిరేకులకు బందుగు లీ కనులందు గండుతు
మ్మెదలఁ గికుర్చునేర్పు జిగి మీఱన కాటుక దిద్దు మొద్దికన్.

నవవిలుకాని పాశములు నా నలువై తమయున్కిదాఁకఁ బం
బినభ్రూశలోలతాకలనఁ బేరెము వాఱెడుచూడ్కులన్మృగాం
గనలకలావిలాసములఁ గ్రన్నన నడ్డ మొగమ్ము నోటమిం
గొనని శ్రవస్సులందు సొబగుల్ గులికింపుము కుండలమ్ములన్.

పరికించితే, నా మోమును
విరితామరపైఁ బ్రమత్తభృంగములటు పా
తరలాడెడులోలాలక
లరుసుగ సరిదువ్వి పువ్వు లమరుపుము సఖా!

కమలానన! విశ్రమిత
శ్రమశీకరనికరమై యెసఁగు మదీయా
స్యము నా విధుబింబమునం
గ్రమముగ నిడుమయ్య కమ్మకస్తురిచుక్కన్.

ఓమహిత! బర్హిబర్హక
డామరమున్ రతిలులితము లలితము తతమున్

గామధ్వజచామర మీ
నా మృదుచికురమున ననలు నయముగ నిడుమా.

ఘనసుందర! శంబరదా
రణవారణకందరమ్ము రమణీయము నా
ఘనజఘనమ్మునఁ గూర్పుము
మణిరశనావసననూత్న మండనసమితిన్.

ఈతీరున రాధావన
జాతానన వలుకఁ గులుకు సందడిఁ గొన సు
ప్రీతుండై పీతాంబరుఁ
డాతం డాతీరుసేఁత నలరించెఁ జెలిన్.

*   *

తమిఁ గ్రీడించుచు రాధతో జమునపొంతం బేర్మిఁ గల్పింపఁ ద
ద్రమణీరత్నమునారు, తారమణిహారమ్ముల్ లసద్వేణి నా
భ్రమఁ, దద్ధ్లాదికుచప్రయాగఫలలిప్సం బొల్చునప్పూరుషో
త్తముహస్తమ్ములయిమ్ములంగులుకుసేఁతల్ గూర్చెఁ గల్యాణముల్

క్రమ మొప్పం గుముదా ప్తబింబయుగ మేఘద్వారకందర్పబా
ణమిత మహ్మా కలివేళ విక్రమశరన్మాఘార్జునద్వాదశీ
స్తిమితాదిన్ జయదేవపండితకవిశ్రీగీతగోవిందకా
వ్యముఁ దెన్గుం బొనరింపఁగంటిమి నృహర్యక్షత్వ మక్షయ్య మై.

# రా ధా మా ధ వ ము

## సం స్తు తి

శ్రీమహితోరస్స్థలచల
తామరసోద్దామదామతతదలతులసీ
స్వామోదితబృందావన,
శ్యామలకోమలసువేష, జయ జయ దేవా!

ప్రలయపయోధితరంగ
మ్ములలోఁ గొఱమీనురూపు పొలు పొలయం బ్రాఁ
బలుకులఁ బేరోడవితం
బలరమును మనిచినట్టి హరి కిదె జేజే.

పొడమినబత్తిం జోబి
ళ్ళిడువాఁడం బుడమిప్రోఁత నెనసి కిణమ్ముల్
కడు విపులమ్మవు మూఁపున
నడరెడుతామేటిమేటి కనవరతమ్మున్.

కొని కొన్ని చిన్ని పువ్వులు
కొనకొనురతిఁ బూజసేతుఁ గుతల మలరె యు
ద్ఘనదశనశిఖరమునఁ జం
ద్రమునిలో నలడాలువోలె దొర నప్పోత్రిన్.

కసి మసఁగి కోడుకుమ్మైఁ గడు
దోసఁగుఁ దలఁచుసురలపగఱదొరతుమ్మెదరా
పసఁ ద్రోచిననఖశృంగ
మ్మైసఁగుకరాబ్జములసామి యేల్గడ మాకున్.

సురజీవనమ్ము పదతా
మరసద్వితయమ్ము రసముమహితముపూర
మ్మురుదార జగత్పావన
గరిమ బలిద్వేషి భిక్షుగణ్యుం డసదే!

పార్థి నిరువదియొకమాఱులు
పరశువునం దఱిఁగి భూమిపతులం దద్ర
క్తరసప్రశమితభవతా
పరసాప్రణుతుండు ప్రాఁపు భార్గవుఁ డవుతన్.

దశకంఠకంఠలుంఠన
దశాసుశిక్షితకరుండు దశహరిదీశా

నిశ సేవ్యపదాంభోజుఁడు
దశరథతనయుండ యండ దంసము మాకున్.

శారదనీరదబాంధవ
మై రాజిలు తెలనిమేన హాలహాతిభీతిం
జేరినయమునాధునినా
పేరిమినలవలువఁ దాల్పు పేర్చుతఁ గరుణన్.

కరుణామృతరసపూరము
గరగరమై చిమ్ముహృదయకమలమునఁ బళూ
త్కారఘూతాధ్వరవిధివా
క్సరణిఁ దెగడుసుగతుఁ డొర్మి సాఁకఁడె మమ్మున్?

పరపూరుష, శౌర్యరసా
కర, ధరణీవలయకంటకప్రాయఖలో
త్కరధూమకేతుసన్నిభ
కరాళకరవాలలోలకర! కొనుము నతుల్.

దినమణిమండలమండన,
ఘనాజవంజవమహీజఖండన, శ్రితమా
నసమండల, ధృతకుండల,
మునిమానసరాజహంస! మోడ్తుఁ గరంబుల్.

వలపారన్ యమునాధునీతటవనీవానీరకుంజస్థలం
బుల రాధాలలితాంగి తోడుగఁ దముల్ వెంగారుక్రీడారసం
బులజా ల్వోసి యనంగు నంగకలితుం బోషించి తోషాబ్ధిఁ దె
ప్పల నోలాడు వ్రజప్రియుండు త్రిజగద్భవ్యప్రభుం డయ్యెడున్.

తలకున్ మీఱినరాసకేళికలితౌత్కంఠ్యమ్మునం జేర్చి వ్రేఁ
తలమ్రోలన్ బిగికౌఁగిలింత, సుధ నాథా! నీముఖ మ్మంచుఁ దాఁ
గలగీతస్తుతికైతవానఁ దమి వెంగన్ ముద్దు గో రాధ, గు
ల్కులనవ్వుల్ వెదజల్లువేణురవళీలోలుండు మ మ్మ్రోముతన్.

తవి, లోలస్మితభావ, మాకులగళద్ధమ్మిల్ల, ముల్లాసిత
భ్రువు, నుల్లోల మళీకదర్శితభుజామూలోర్ధ్వహ స్తస్తన
మ్మువుగోపీగణచేష్టితమ్ము నిభృతత్వాప్తిన్ నిరీక్షించి తృ
డ్వివశుండై రస మూహా సేయునవగోవిందుండు మాదండ యౌ.

పొనరునంచుకయోరమోమునోయూరమ్ము
భువనమోహనమంత్రమూర్తి గాఁగఁ,
గొని పంతముల్ లోలకుండలమ్ములతోడ
మౌళివతంసముల్ లీల నాడ,
పరవిఁ బూరించునంశముదీప్తిపదమున
దత్తావధానలు తలిరుబోంట్లు

కనుల కాగలముగ నెనరువిందులు వెట్టి
మనసు ద్రుచ్చిలిగొన్న మాయదాన్లు,

పొంగి పొరలెడునమృతముపుట్టినిల్లు
ముగ్ధసుందర మా రాధ మోము పేరి
సోమునందుఁ గందళితముల్ సుచిర మా ము
కుందుదృక్తరంగములు చేకూర్చు సుగము.

ఘనవర్షాకుల గోకుల మ్మఖిలముం గావన్ శిలీంధ్రమ్మటుల్
గొనన్ వ్రేలన్ గిరి నెత్తువేల ముదితల్ గోపాంగనల్ ముద్దు లె
చ్చినకోర్కిం గొనఁ దద్వరాధరపుటీసిందూరముద్రాంకితం
బు నవేందీవరనేత్రుబాహువు సతంబుం గూర్చు శ్రేయమ్ములన్.

లలితరసాలవాలమ్ము రాధాముగ్ధ
వదనాంబుజమునకుఁ గొదమ తేఁటి,
మానిత త్రైలోక్యమాళినేపథ్యక
లాపకలనము నీలోపలమ్ము,
వసుమతీతలభూరిభారావతారుఁబు
తులువమూఁకల కల్ల తోఁకచుక్క,
గోపనితంబినీకులవిలోలతరలో
చనచకోరములకుఁ జంద్రుమామ,

కూర్చు కొలువుదు కాండ్రకుఁ గొంగుపసిఁడి,
సురలచేపట్టుకుంచమ్ము, సూరిజనుల
స్తుతివచస్సుల కెల్ల, కంసునకు నశని,
ప్రోవఁడే మమ్ము దేవకీదేవికొడుకు.

వటముదరిం బరుండితిరి, వర్తిలు నొక్కఁడు కృష్ణభోగి య
చ్చట, విన లేదొ, నందవిభుసద్మ మదే యను రాధపల్కు లాఁ
దటఁ బతికోపచారములు దా విని మించు గృహాగతార్చన
స్ఫుటత స్వకీయులొద్ద యదుసూనుఁడు వల్కె నమోఘు లింత లే!

సరవిన్ నీలనిచోలలాలితుఁ డనున్, సంగీతపీతాంబరో
ద్ధురమా రాధ యురస్స్థహర్మ్యముఖమునందుం, గాంచి యన్గుం జెలుల్
పరిహాస మ్మొనరింపఁ బ్రేయసిఁ ద్రపాభారంబునం జూచుచున్
దరహాస మ్మొనరించె శౌరి జగదానందప్రదుం డయ్యెడన్.

నలి, సమ్మోహనమౌళిఘూర్ణనచలన్మందారవిభ్రంశనా
కలన స్తంభనకర్షణోన్మథనముఖ్యవ్యాపృతిస్ఫూర్తిఁ బొ
ల్తులకున్ మంత్రవరమ్ము, దృష్యదమృతాంధోలోకవిద్వేష్టృకం
ఠలలత్పాశము, కంసవైరిమురళీనాదమ్ము కూర్చుం దముల్.

వినయానమ్రపురందరాదిదివిషద్బృందాధిరాణ్మౌళికాం
చనకోటీరవినీలకోమలమణీసందర్శితేందిందిరా

ననపక్షమ్ము, మరందసుందరమిళన్మందాకినీమేదుర
మ్ము, నవేందీవరపత్రనేత్రుచరణాంభోజమ్ము మా కీడ్య మా.

సిరిచన్గొండలు రెండు నిండుతమి నాశ్లేషించునప్పట్ల ని
ర్భరకాశ్మీరసమార్ద్రమై మెఱయుచున్ వ్యక్తానురాగమ్ముటుల్
స్థిర మై ఖేలదనంగఖేదగలితస్వేదాంబుపూరంబు శ్రీ
హరివక్షమ్మొడఁగూర్చుఁగావుత సతమ్మస్మన్మనోభీష్టముల్.

అని రాధాకుచకుంభసంస్మరణ మొయ్యం గూర్చుకుంభస్థలం
బునఁ బెంపారునిభంబుతో నెదిరి మోముం గ్రమ్మఁ గ్రొంజెమ్మటల్
గనులన్ మూయుడుఁ జాలు నోటమి నిదే కైకొంటి నీ వన్న కం
సునకున్ మాత్రపునీళ్ళు జల్లినమహాశూరుం డిడుం గోరికల్.

క్రమ్మెఁ గాఱుమొయిళ్ళు గవియుపేరిఱులతోఁ
గాటుక పూసినబాట బయలు,
నిగిడెఁ దమిస్ర, కానఁగుచెట్లమఱుఁగుల
శ్యామలమ్ములు వనభూము లెల్లఁ,
జీమ జిటుకన్నఁ జిమ్మట జిట్టన్నఁ
గడు నుల్కిపడుఁ బసిగాయ, వీనిఁ
జెచ్చెర నీ విలు జేర్పుమా యనునందు
నానమై నరిగి ప్రత్యధ్వకుంజ

భూరుహమ్ములఁ జిలివిలిపోవఁ బ్రబిమ
లానురాగానుభావమ్ము నతివివశులు
రాధికామాధవులయమునాధునీప్ర
పూతతటరహఃక్రీడ లేపునఁ దనర్చు.

## జయదేవుఁడు

విలసితోత్కలబిందుబిల్వపీయూషోద
నిధిపూర్ణకైరవిణీవిభుండు,
దివ్యానుభవభోజదేవరామాంబికా
ఘనగర్భశుక్తిముక్తాఫలమ్ము,
శారదాచారుసుచారిత్రచిత్రిత
పూతసుస్వాంతనికేతనుండు,
సరసపద్మావతీచరణచారణచక్ర
వర్తి, జాంబూనదప్రఖ్యమూర్తి,

సుగుణధాముఁడు, సత్కవిసోముఁ, డమల
భావుఁ, డిందిరాలోలులీలావినోద
విలసితమ్ములు కూరిచి పేర్మిఁ బాడి
యాడినవలంతి జయదేవు వేఁడవలదె!

నేరిచి నీరజనాభుని
కూరిమి పేరిమి శ్రవస్సుఁ గొను కైత సుధా
పూరము జయదేవవచ
స్సారము సరణిఁ జననికవి చనఁడో కవి యై?

డుల్లఁగ వీనుల త్రుప్పుడు
లల్లఁగ జయదేవకవికులాగ్ర్యునిరసపూ
రోల్లాలితములు పలుకులు
కొల్లలుగా వినుఁడు ముదముఁ గొనుఁ డెల్లపుడున్.

మహితవాణీమంజుమంజీరరవళుల
పలుకు సూపఁగ నుమాపతిధరుండు,
లలితభావలతాంతముల మేలివలపుల
హరిదంతములఁ జిమ్మ శరణసుకవి,
శృంగారరసవీచి పొంగారుమధురర
చనల గోవర్ధనాచార్యవర్యుఁ,
డందె వేసినచేతు; లలఁతియే భువనవి
శ్రుతకీర్తి శ్రుతిధరసూరిమౌళి,

ధోయి మృదుపదవిదితాధ్వయాయి, భోజ
దేవరామాంబికాజయదేవుఁ డన్న

వాసుదేవుఁడు నికట, మప్పద్మ పద్మ,
ముద్దు లాలికించుపలు కది మురళీరవళి.

ఇప్పపూదేనియా! త్రిప్పుకొ మ్మిఁక నెట్టి
యూహలు, నీపప్పు లుడుకఁబోవు;
శర్కరా! మానుమా తర్కవితర్కముల్,
గరగర కేమి, కర్కశవు మివుల;
ద్రాక్ష! నీదవుపేరు తడవఁబోయెడువారు
కలికమ్మునకు నేనిఁ గానరారు;
అమృతమా! మృతమవ యయితి, నీనామమ్ము
నేతిబీరఁ గికుర్చు నెఱి వహించె;

నీరమా! కావు రసమవు, నీరసమువు;
మ్రంకు మింక నెడంద మాకంద! కుంది;
పడఁతికెమ్మోవి! పద, చొల్లుబావి వీవు;
సరసజయదేవశుభదవాక్సార మిదిగొ.

అరయన్ సంసరణామయోపశమన మ్మెల్లెస్స యై నిచ్చఁ గ్రో
త్తరుచుల్ గొల్పుముకుందపాదవనజధ్యానామృత మ్మోలిఁ గ్రో
ల, రసస్యందికలావిలాసములజాడల్ జూడఁగాఁ గోరుచుం
దురయేని న్జయదేవసత్కవినోదుల్ తోరంబు లాలింపుఁడీ!

తతగాంధర్వకలావిలాసముల వైదగ్ధ్యమ్ము, శ్రీశార్చనా
దృష్టి, శృంగారవివేకతత్త్వరచనోద్దీపత్వముం, గావ్యని
ర్మితిరీతిన్, జయదేవపండితకవి శ్రీగీతగోవిందవా
క్కృతి విజ్ఞుల్ జవిఁ జూచి మోవరొక్కొ యా ధన్యాత్ము మూర్ధమ్ముపైన్.

కర మలరుత మురభంజను
చరణములే శరణ మన్న జయదేవకవీ
శ్వరుభారతి రసికులమదిఁ
స్థిరముగఁ గోమలకలావతి యువతియటు లే.

## ముగింపు

ధాత్రి శ్రీవత్ససగోత్రుఁ డాపస్తంబ
సూత్రుఁ డూర్జితయశః శ్రోత్రియుం డ
వితయజుశ్శాఖాపవిత్రుఁడు బుధజన
స్తోత్రపాత్రచరిత్రచిత్రితుఁడు చి
దంబరపౌత్రుఁ డీడ్యపదసుబ్రహ్మణ్య
పుత్రుఁ డమలవచోభూషణుండు
రాజరాజేశ్వరీరాజితచరణరా
జీవసేవనధన్యజీవనుండు

నుడుకలాపోషణప్రవణుఁడు శ్రితార్థి
తోషణవిశేషణుఁడు నాగభూషణుం డ
నుంగుతండ్రిగఁ ద్రిపురయొసంగునోడి ని
సుంగులమ యాటఁ గొంటి మీభంగివాసి.

అటులు కడుపు చల్లగఁ గన్నయమ్మ యయ్యొ
నుల్లమునఁ ద్రిపురామహాతల్లి సనక
తనివు నారాయణభ్రాతృతానిరూఢి
ప్రౌఢిఁ గన నస్మదగ్రజాత్వమునఁ దనరె.

ఎనక మెసఁగ రమాహ్వాదయేసుకూర్మి
పేర్మి నేర్చి పేర్చినకైఁత వెలయఁ బ్రథితి
విదితజయదేవగీతగోవిందకావ్య
ముం దెనుఁగుసేయునియతి నే పొందితి మిటు

మక్కికి మక్కి గాక, పొడిమాటలబాటలపోఁక గాక, వే
ఱొకరకమ్ముకల్పనమునొప్పను గాక, తెఱుంగనీక యే
దిక్కున మాతృకోల్లసితదివ్యతరార్థరసానుభూతి, సొం
పెక్కనమాకృతిం గవికులేశ్వరు లాదట నాదరింపరే.